"దూరపు ప్రయాణమునకు
శ్రేష్ఠమైనది"





ఈ పర్యాయము మీరు కొనునది గుడ్రిచ్ సిల్వర్ టౌన్ టైరుగ యుండునటుల చూడ వలయును.

# Goodrich Silvertowns

## మద్రాసు స్వరాజ్యపక్షము

ఒక నూతనసంస్థ

మద్రాసు శాసనసభ్యత్వములకు రాజీనామాల నొసంగిన కొందరు కాంగ్రెసు శాసనసభ్యులు గతఆదివారము సమావేశమై "మద్రాసు స్వరాజ్యపక్షము" అనుపేర ఒకనూతన రాజకీయ సంస్థను స్థాపింప నిశ్చయించిరి. ఈనూతనపక్షముయొక్క ఉద్దేశ్యములు తెలుపునట్టి ప్రకటన త్వరలోనే ప్రచురింపబడును. ఈ కార్యమునకుగాను పక్షమువారి సంతకములు ప్రోగుచేయబడుచున్నవి. న్యాయబద్ధమైనటువంటియు శాంతియుతమైనటువంటి యెల్ల మార్గములలో స్వరాజ్యసంపాదనయే, యీపక్షముయొక్క ముఖ్య ఆదర్శము. ఈ ఆదర్శమును నమ్మినవారు యీపక్షమువారు శాసనసభలయందు పనిచేయదలచియున్నారు. ఇదేఆదర్శమునకు యితరపక్షములు ఏవైనను పనిచేయుచున్న అపక్షములతో నూతన మద్రాసు స్వరాజ్యపక్షము సహకార మొంసగను.

పైపార్టీవారు ఎన్నికలలో శాసనసభ్యత్వ స్థానములను సంపాదించుటకు ప్రయత్నము జేయుదురు.

## వి. వి. గిరిగారు మైసూరు పోవుచున్నారు

మైసూరు రైల్వే కార్మికసంఘమువారు ఆహ్వానించిరి

బెజవాడ, జనవరి 24:— యం. యస్. యం. రైల్వే యుద్యోగుల యూనియను అధ్యక్షులును అఖిలభారత రైల్వే కార్మిక సమితియొక్క ప్రధాన కార్యదర్శియు నగు వి.వి.గిరిగారు మైసూరు రైల్వేపనివాండ్ల సంఘముయొక్క ఆహ్వానము నంగీకరించి మైసూరు పోవుచున్నారు. మైసూరు ప్రభుత్వమువారు రైల్వేపనివాండ్ల నెటులను ఆదరణబుద్ధితో ఆలకింపగలరని తెలియుచున్నది.

గిరిగారు బెజవాడలో 2-2-1930 తేదీని బెజవాడలో జరుగబోవు యం. యస్. యం. రైల్వే యుద్యోగుల సాంవత్సరిక సాధారణసభకు అధ్యక్షత వహించెదరు. (ఫ్రీ ప్రెస్)

## ఆంధ్ర విద్యార్థిమహాసభ

సి. పి. రామస్వామి అయ్యర్‌గారి యధ్యక్షతను 8, 9 తారీఖులలో జరుగును

విద్యార్థి మహాసభాహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత యస్. వి. కృష్ణారావుగారు యిట్లు వ్రాయుచున్నారు:— శ్రీయుత సుభాష్‌చంద్రబోసుగారికి శైలువిధింపబడుటవలన 9వ ఆంధ్రవిద్యార్థిమహాసభ ఆపుచేయబడవలసివచ్చెను. సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారు సభాధ్యక్షులుగా నుండ నంగీకరించిరి. ఫిబ్రవరి 8, 9 తారీఖులలో విద్యార్థి మహాసభ రాజమహేంద్రవరములో సమావేశమగును. (తం॥)

ప్రచారక్ పరీక్ష:— రాష్ట్రభాషా విశారద పరీక్ష జరిగిన వెంటనే ప్రచారక్ పరీక్ష జరుపుటకు నిశ్చయింపబడెను. ఈ పరీక్ష 1930 ఏప్రిలు 22వ తేదీని ప్రారంభమగును. ఈ పరీక్షసంబంధమగు దరఖాస్తులు రుసుముతో సహా మార్చి 31వ తేదీలోపుగ రిజిష్ట్రారుకు చేరునటుల పంపుకొనవలెను. ప్రచారక్ పరీక్ష నిబంధనలు ప్రకారమైతే అభ్యర్థులెల్లరు రాష్ట్రభాషావిశారద పరీక్షయందు కృతార్థులై యుండవలెను. ఒకవేళ యిప్పుడు ఏ అభ్యర్థియైనను రాష్ట్రభాషా విశారద పరీక్షయందు కృతార్థుడగు పూర్వమే ప్రచారక్ పరీక్షకు కూర్చొనినయెడల యీ అభ్యర్థి ప్రచారక్ పరీక్షయందు బడసిన మార్కులు మాత్రము లెక్కింపబడి యీ విద్యార్థి రాష్ట్రభాషా పరీక్షయందు కృతార్థుడైన మీదటనే వానికి ప్రచారక్ పరీక్షా సర్టిఫికెట్టు యొసగబడును. అని పరీక్షామంత్రి తెలుపుచున్నారు.

## స్థానిక వార్తలు

మద్రాసు కిరసనాయిలుపనివాండ్ర సంఘము:— భారత వర్తకసంఘముల చట్టము (1926 సం) క్రింద పైసంఘము గత 23వ తేదీని రిజిష్టరు కాబడినది.

శ్రీనారాయణ నంబూద్రిపాద్‌గారి స్థితి:— శ్రీనారాయణ నంబూద్రిపాద్ యం. యల్. సి. గారు జనరలు ఆసుపత్రియందు నెమ్మదిగానుంచుచున్నారని తెలియుచున్నది.

అసెంబ్లీ యెన్నిక:— రాబోవు సామ్రాజ్య శాసనసభయొక్క పై ఎలెక్షనులో మద్రాసు నగర నియోజకవర్గము తరపున, వి. శివప్రకాశ మొదలియార్, అడ్వకేటుగారు అభ్యర్థిగా నిలుచుటకు దలచుచున్నారు.

బిన్నీకంపెనీ ఇంజనీరింగు పనివాండ్ర సంఘము:— రేపు బుధవారము సాయంకాలము 4-30 గం॥ బిన్నీ కంపెనీ కార్యాలయము యెదుటనుండు మైదానమునందు పై సంఘమువారి బహిరంగసభ జరుగును. శ్రీ జ. స. శ్రీ రామ్‌గారు అధ్యక్షత వహించెదరు. ప్రముఖ నాయకులు ఉపన్యసించెదరు.

రిచ్చర్డసన్ క్రుడాస్ కంపెనీ పనివాండ్ర సంఘము:— రేపు బుధవారము సాయంకాలము 4-30 గంటలకు నూతన రైల్వేసామానల పాకపద్ద పై సంఘమువారి బహిరంగసభ జరుగును. శ్రీ గ. సెల్వపతి చెట్టియార్‌గారు అధ్యక్షతవహించెదరు. శ్రీయుతులు జి. రామానుజులు నాయుడు, వి. ఏ. మాణిక్యం మొదలియార్‌గార్లు మద్యపానమువలన సంభవించెడు చెడుగులనుగూర్చి ఉపన్యసించెదరు.

మద్రాసు పోర్టుట్రస్టు పనివాండ్ర సంఘము:— రేపు 29వ తేదీని సాయంకాలము 4-30 బర్మాషెల్ ఆయిలు కంపెనీ ఎదుటనుండు మైదానమందు హైకోర్టు సముద్రతీరమున పై సంఘముయొక్క బహిరంగసభ జరుగును. శ్రీ టి. శివరావు యం. ఏ. గారు అధ్యక్షత వహించెదరు. జి. రామానుజులు నాయుడుగారును యితరులును సభయందుపన్యసించెదరు.

సామ్రాజ్య శాసనసభ్యత్వ ఖాళీస్థానము:— శ్రీయుత యస్. శ్రీనివాస అయ్యంగార్ గారు తమ అసెంబ్లీ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చుటచే ఖాళీపడిన స్థానమునకు మరల ఎన్నిక జరుగునని ప్రకటింపబడుచున్నది.

మధ్యాహ్నము 3 గంటలకు పూర్వము 31వ తేదీని నామినేషను దరఖాస్తులు రిటర్నింగు అఫీసరగు ఇ. కానరాన్ స్మిత్, గారివద్ద దాఖలుచేయవలెను. వీటి పరిశీలన ఫిబ్రవరి 3వ తేదీని జరుగును-అభ్యర్థులు ఒకరికిపైగా నున్న మార్చినెల 6వ తేదీని ఎన్నిక జరుగును.

యం. యస్. యం. రైల్వేపనివాండ్రసంఘము:— పైసంఘము యొక్క జమాఖర్చుల యీనరలు ఆఫీసులయొక్కయు, సెంట్రలుస్టేషను పాల్టుకొట్టాయిలకు సంబంధించిన లోకో, ట్రాఫికుశాఖలయొక్కయు ఉద్యోగుల ప్రత్యేకసాధారణసభ రేపు సాయంకాలము 4-45 గం॥ పరమానందదాస్, ఛోటాదాస్ గారి ధర్మశాలయందు జరుగును. మార్చినెలలో మండల సాంవత్సరిక సమావేశము జరుపు ఏర్పాటుల విషయమును అందుకు కావలసిన ద్రవ్యమును ప్రోగుచేయు విషయమును యీసభలో ఆలోచింపబడును. 30వ తేదీని సాయంకాలము 6 గం. సాల్టు కొటార్సు ఎదుటనుండు స్థలమున పైసంఘమువారి మరియొక సభ జరుగును.

భారతీయ సంగీత పాఠశాల:— పైసంస్థయొక్క రెండవ వార్షికోత్సవము రేపుసాయంకాలము 5-30 గం॥ ప్రాగ్రెసివ్ యూనియన్ హాలునందు జరుగును. గౌ. సర్ యం. కృష్ణనాయరుగా రధ్యక్షత వహించెదరు. ఏ. రామస్వామి మొదలియార్ గారు భారతీయ సంగీతమునుగూర్చి ఉపన్యసించెదరు. ఈసందర్భమున సంగీత ప్రదర్శనము జరుగును.

పురందరదాస్ దినోత్సవము:— మద్రాసు సంగీతపరిషత్ వారు రేపు సాయంకాలము 5-30 గం॥ గోవిందప్ప నాయక్‌వీధిలోనున్న సౌందర్యమహాలునందు పురందరదాస్ దినోత్సవమును జరిపెదరు. పండిత ఆళసింగరాచార్, యం. సౌందరరాజభాగవతులుగార్లును యితరులును పురందరదాస్ గారి జీవితమునుగూర్చి ఉపన్యసించెదరు. పురందరదాసుల వారి సంకీర్తనములు ప్రదర్శనముకూడ జరుగును.

మద్రాసు సంగీత పరిషత్:— పై సభయొక్క సాంవత్సరిక సాధారణ సమావేశము రాబోవు 30వ తేదీని సాయంకాలము 5-55 గం॥ గోవిందప్పనాయక్ వీధిలోనుండు సౌందర్యమహాలునందు జరుగును. సంఘముయొక్క సాంవత్సర నివేదిక ఆమోదించుట నూతనసంవత్సరపు ఆదాయవ్యయపట్టిక విషయము యోచించుట కార్యనిర్వాహకుల ఎన్నికలు యీసభయందు జరుగును.

దక్షిణాఫ్రికా పరిస్థితి-జి. ఎస్. బాజ్‌పాయిగారి అభిప్రాయము:— సర్ కే. వి. రెడ్డిగారితో సంప్రదించవచ్చిన జి. యస్. బాజ్‌పాయిగారు దక్షిణాఫ్రికా సమస్యను గూర్చి తమఅభిప్రాయము తెలుపుచు దక్షిణ ఆఫ్రికా పరిస్థితినిగూర్చి ప్రస్తుతము కలవరము జెందుటకు కారణము లేదనియెను. ప్రస్తుతము తూర్పుఆఫ్రికా సమస్యయే యెల్ల భారతీయుల మనస్సులలో ప్రధానసమస్యగా నున్నది. జి. యస్. బాజ్‌పాయిగారు రేపు ఉదయమున ఢిల్లీకి వెళ్లుచున్నారు.

తిరువల్లిక్కేణి అర్బన్ సహకారసంఘ రజతోత్సవము-నాటక ప్రదర్శనము:— పైరజతోత్సవ సందర్భమున ప్రదర్శింపబడిన మార్కండేయ అను తమిళనాటకము, నాటాస్తుగా సభ్యులుకాని యితర జనులు ప్రదర్శన పందిరిలో చొచ్చుటచే నాటకము ఆపుదల చేయబడెను. ఎక్కువగా జనులు వచ్చుటచే అల్లకల్లోలము జరిగి ప్రదర్శనము ఆపుదలవలసి వచ్చెను. ఇందుచే సభ్యులకు కలిగిన యిక్కట్లు వారు మదిని పెంచక యుండురని కమిటీవారు కోరుచున్నారు. ఈనాటకము మరల 29వ తేదిని సాయంకాలము 6.15 గం॥ జూబిలీ పందిరిలో జరుగును.

నవగిరి అండుకో క్యాలెండరు

6, కుంభారవాడా, బొంబాయి నం 4 రు.

ఈ కాలెండరు చేరినది. ఇదియొక మామూలుపైని ఇంగ్లీషు కాలెండరు. చక్కగానున్నది.

మద్యనిషేధప్రచారము-ప్రభుత్వమువారి సానుభూతి

కడపజిల్లా టెంపరెన్సు ప్రాపగాండా కమిటీ సెక్రటరి ఏ. కే. మునిగారిట్లు వ్రాయుచున్నారు:— శ్రీ కడపజిల్లా కలెక్టర్‌దొరగారు, విలేజిఆఫీసర్లకును, అబ్కారీ, సాల్టు, పోలీసుద్యోగస్థులకును, ప్రచారకులుగాని, సెక్రటరీగాని తమతమ జ్యూరిస్‌డిక్షనులలో ప్రచారము సలుపునప్పుడు పై డిపార్టుమెంటులవారు ప్రచారకులకు సర్వవిధముల తోడ్పడవలయునని ఉత్తరువుల జారీచేసియున్నారు. ఇందులకు మండలవారు అందరును శ్రీ కలెక్టర్‌గారికి వందనముల నర్పించుచున్నారు. మా కమిటీవారును వారి కెంతయు కృతజ్ఞులు.




## మదరాసు శాసనసభవారి యుత్సాహము

మదరాసు శాసనసభలోని కాంగ్రెసు పక్షేతరులకు, రాజప్రతినిధిప్రసంగమునకు పిమ్మట నయినను, రౌండుటేబిలు సమావేశముపట్ల ఉత్సాహము తగ్గలేదు. సాల్డానాగారు, ఢిల్లీనాయకుల ప్రకటనములోని షరతులు ముందుగ చెల్లింపబడవలయునని సవరణ దెచ్చిరి గాని, అంతవరకాగుటకు శాసనసభ్యులకు ఓపిక లేకపోయెను. రాజకీయనిర్బంధితుల విడుదల యయినను, వీరి కవసరము లేదయ్యెను. రాజప్రతినిధిగారిని పొగడుటతో, సభ్యులు తృప్తిజెందిరి. ఎట్టిసందర్భములలో నయినను, వీరు రౌండుటేబిలు సమావేశమునకు వెడలవలయు ననిరి. ఈసమావేశము నందు, దేశాభివృద్ధిని గోరువారి కెక్కుడు ప్రాతినిధ్య ముండవలయునను సవరణను రంగనాథమొదలిగారు తెచ్చిరి గాని, దేశాభివృద్ధిని గోరనివా రెవరను నందియము వచ్చెను. ఈతరగతిలో జేరుట కెవరికిని ఇష్టము లేకపోయెను. అందుచే, సాల్డానాగారి సవరణతో బాటు రంగనాథమొదలిగారి సవరణగూడ వ్యర్థమయ్యెను. రివిన్యూ సభ్యులగు గా॥ కాంపుబెలుగారు, శాసనసభానిర్ణయమును అనధికారసభ్యలకే వదలిపెట్టెదమనిరి. ప్రభుత్వసభ్యులు వోటింగునందు పాల్గొన రని తెల్పిరి. రాజప్రతినిధిప్రకటనమును ఆమోదించుచు, రౌండుటేబిలు సమావేశము, ఈ సంవత్సరమే జరుగవలెనని, శాసనసభవారు తుదకు తీర్మానించిరి.

రౌండుటేబిలు సమావేశములో వోటింగుతో గాని, అధికసంఖ్యాకనిర్ణయముతో గాని, శాసనసభ్యలకు నిమిత్తము లేదు. పార్లమెంటుసభవారి అనుగ్రహముపైనను, బ్రిటీషు ప్రభుత్వమువారి అనుగ్రహముపైనను, వీరు ఆధారపడదలచిరి. జస్టిసు పక్ష నాయకు లగు డా॥ బా॥ మునిస్వామి నాయుడుగారు ముచ్చటించుచు, రాజప్రతినిధిగారు గోరిన ఏకీభావము రౌండుటేబిలు సమావేశమునందు కుదురుట కష్టము గాదని, నుడివిరి. మదరాసు మెయిలు పత్రిక కిట్టి ప్రతిపాదనము సయితము వెగటుగ దోచెను. మెయిలు పత్రిక యిటుల వ్యాఖ్యానము జేసెను

"ప్రజలలో ననేకులకన్నను, మునిస్వామినాయుడుగారు విశేషాశాభరితులుగ గనుపించుచున్నారు. హిందూదేశమునందలి ఇతరభాగముల వార్తల బట్టి, ఐకమత్య మింతసులభముగ కుదురునని తలంప వీలులేకున్నది. రౌండుటేబిలు సమావేశము గూడులోపల, ఐకమత్యము కుదురదేమో యని అతురము గనుపించుచున్నది. ఐకమత్యము కుదురనిచో అధినివేశస్వాతంత్ర్యము లభించునని ఆశపడుట వట్టిభ్రమ యని సర్ సప్రూగారు స్పష్టపరచిరి. తొమ్మిదిసంవత్సరముల క్రిందటి కన్నను, ఇప్పుడు మనము ఐకమత్యమునకు దూరముగ నున్నాము. అల్పసంఖ్యాకసంఘముల భీతిని బాపుటకు అధికసంఖ్యాకులు వెనుదీయుటచే, రాజకీయ దృక్పథము వెనుకంజ వైచినది."

ఆంగ్లో-హైందవపత్రిక లిట్టి విపరీత వాదము గావించుట వింత గాదు. రౌండుటేబిలు సమావేశమున కెట్టి అనుకూలఫలము లేకుండ నుండవలెనని, ఈపత్రికలు గోరుట సహజమే. నిజమేమన, అంతఃసఖ్యము స్వాతంత్ర్యసిద్ధికి పిమ్మటనే కుదురును గాని, పరాధీనస్థితి ఐకమత్యరాహిత్యమునకే దారి జూపుచుండును. విభజించి పాలించు పద్ధతి ప్రబలునంతవరకు, జాతీయసంయోగము చేకూరు నని తలంచుట కవకాశము లేదు. విత్తు ముందా, చెట్టు ముందా అనువిధమున, ఐకమత్యము ముందా స్వపరిపాలనము ముందా అను వివాదముల నెంతకాలము గావించినను ప్రయోజన ముండదు. కెనడా దక్షిణాఫ్రికా మున్నగు దేశములలో, స్వపరిపాలనానంతరమే ఐకమత్యము చేకూరెను. అంతకు పూర్వము కెనడా దేశస్థితి హిందూదేశస్థితికన్నను అధ్వాన్నముగ నుండె నని, చరిత్ర దెలుపుచున్నది. అంతఃకలహములను పోగొట్టుటకు, స్వాతంత్ర్య ప్రదానముకన్నను వేరు మార్గము లేదని, డర్హాం ప్రభువుగారు కెనడా విషయమున చాటియుండిరి. వారి హితవే తుదకనుసరింపబడెను. హిందూదేశమునందు మాత్రము అన్యసిద్ధాంతమును వర్తింపజేయ నేలనో తెలియకున్నది. మొత్తముమీద రౌండుటేబిలు సమావేశమునందు, దేశాభివృద్ధి గోరెడివారికి అర్హ ప్రాతినిధ్య మొసగిక, ప్రత్యేకసాంఘికపక్షములకు ప్రాతినిధ్య మొసగుచో, భారతీయులలో ఐకమత్యము లేదనియు, ఒకరితో నొక రేకీభవింపరనియు, చాల కాలమువరకు భారతీయులకు స్వపరిపాలన మొసగుటకు వీలుండదనియు చాటుటకు, వీలగును. ఫలితమటులనే యుండుచో ఆశ్చర్యపడ నవసరముండదు. సహకారవాదులలో ఐకమత్యము చేకూరదను నమ్మకము గుదురకున్నది. మహమ్మదీయు లందరును జిన్నాగారి నాయకత్వముక్రింద ఏకము గావలయునను సంకల్పము విఫలమయ్యెను. జిన్నాగా రిందు కంగీకరింపకుండిరి. సర్వపక్షసమావేశము నేర్పరచు ప్రయత్నము కొనసాగునటుల దోపదు. డాక్టరు మూంజీగా రిట్టి ప్రయత్నమును మానుకొనవలయునని, సప్రూగారిని కోరిరి. అధినివేశస్వాతంత్ర్యము వెంటనే ప్రసాదింపబడునను వాగ్దానము బ్రిటీషు ప్రభుత్వమువారినుండి వెలువడుచో, అప్పుడాలోచింపవచ్చు ననియు, అట్టి యాశ లేకపోవుటచే నిరర్థక సమావేశముల నేర్పరచి ప్రయోజనము లేదనియు, మూంజీగారు స్పష్టపరచిరి. మొత్తముమీద, ప్రస్తుతపు అట్టహాస మంతయు, అధినివేశస్వాతంత్ర్యమునకు గాక, మరికొన్ని స్వల్పసంస్కరణముల బడయుటకు తోడ్పడవచ్చును. కాంగ్రెసు కృషివలన గాని, దేశస్వాతంత్ర్యము లభించునని తోపదు. ఈ సంగతిని జాతీయ పక్షమువారు గ్రహించి, కాంగ్రెసు ప్రయత్నములకు చేయూత నొసగుచో, దేశసేవ జేసినవా రగుదురు. లేనియెడల, సందిగ్ధసమయమున, దేశమునకు తీరనినష్టము గలిగించినవా రగుదురు.

## స్వరాజ్యపక్షము

శాసన సభ్యత్వములకు రాజీనామా నిచ్చిన మదరాసు కాంగ్రెసు పక్షసభ్యులు, స్వరాజ్యపక్షము పేరుతో మరియొకపక్షము నేర్పరచినటుల తెలియుచున్నది. వీరు పూర్ణస్వరాజ్యాదర్శము నంగీకరించినటుల దోపదు. వీరు మరల ఎన్నికలలో పాల్గొని, సాధ్యమగునన్ని స్థానములను స్వాధీనపరచికొనదలచిరట. శాసనసభలలో నింతకాలమునుండియు కాంగ్రెసు పక్షము పని జేసి, ముచ్చట దీర్చుకొనెను. పూర్ణస్వరాజ్యాదర్శమును కాంగ్రెసుసభ అంగీకరించిన పిమ్మట, శాసనసభల ద్వారా దీనిని పొందదలచుట వ్యర్థప్రయత్న మనియు, ప్రజాశక్తిని బలపరచుట తప్ప వేరుసాధనము లేదనియు, ఏమాత్రము యోచించినను తెలియగలదు. సందర్భముల నన్నిటిని యోచించియే, కాంగ్రెసు పక్ష నాయకు డగు పండిత మోతీలాల్ నెహ్రూగారు, శాసనసభాబహిష్కారమును ప్రతిపాదించెను. కాంగ్రెసుసభ దీని నామోదించెను. కాంగ్రెసు తీర్మానమునకు విరుద్ధముగ, శాసనసభ్యత్వమునకు రాజీనామా నిచ్చిన కాంగ్రెసు పక్ష శాసనసభ్యులు మరల వేరొకపక్షముగ నేర్పడి ఫలరహితమగుశాసనసభాప్రవేశమునకై తమకాలమును వినియోగించుట దేశమురదృష్టము తప్ప వేరుగాదు. దేశబంధుదాసుగారును, పండిత మోతీలాల్ నెహ్రూగారును, స్వరాజ్యపక్షము నేర్పరచినపుడు, వేరొకసంచలనము లేనికారణముచే, శాసనసభాప్రవేశమయినను మేలేయనియు, శాసనసభలలో జేరి ప్రతిష్టంభనము నలుపుటవలన కొంత నిరోధ మేర్పడుననియు, ప్రతిపాదించియుండిరి. ప్రతిష్టంభనము కొనసాగదయ్యెను. తుదకు మంత్రి పదవుల నాక్రమించి, సహకారము సలుపవలె ననియు, నిరోధమును బొత్తుగ విడనాడవలయు ననియు, కోరెడివారు బయలుదేరిరి. ఇట్టిదుస్థితినుండి దప్పించుకొనుటకు శాసనసభలను బహిష్కరింప నవసరముగలదని, పండిత మోతీలాల్ నెహ్రూగారు అనుభవముచే గ్రహించిరి. దేశబంధుదాసుగారు జీవించియున్నచో, వారును అటులనే బోధించెడివా రని విశ్వసింపవచ్చును. దాసుగారిస్థాన మాక్రమించి పని జేయుచున్న సేన్ గుప్తగారటులనే వ్యక్తపరచియుండిరి. నూతన మదరాసు స్వరాజ్య పక్షమువారు వెనుకటికన్నను శాసనసభలద్వారా స్వరాజ్యప్రాప్తి కెక్కుడుగ తోడ్పడెదరనుట, భ్రమ తప్ప వేరు గాదు. కాంగ్రెసు తీర్మానబలమును క్షీణింపజేయుటకును, కాంగ్రెసు ప్రచారమునకు ప్రతిబంధకము గలిగించుటకును మాత్రము, నూతనపక్షమక్కరకురావచ్చును. అయినను, కాంగ్రెసుసభ్యులు శాసనసభల వ్యామోహమును విడనాడి, కాంగ్రెసు కార్యక్రమమునుదీక్షతోనిర్వహించుటకుబూనుకొన్న, ఒకవంక అధికారులచేతను, వేరొకవంక నూతనపక్షమువారిచేతను ఏర్పడెడి నిరోధములను సులభముగ దాటి, త్వరలో దేశమును గమ్యస్థానమునకు జేర్చెదరని నమ్మెదము. వింత ఏమన, 17వ మార్చి తేదిన తమ రాజీనామాలు అములులోనికి రావలయు నని, కోరిన కాంగ్రెసుపక్ష సభ్యుల విన్నపమును గవర్నరుగారు నిరాకరించి, రాజీనామాలు సరియగువిధమున గావింపబడలేదని, అభిప్రాయపడిరని తెలియుచున్నది. ఇట్లయినచో వీరు వెంటనే రాజీనామా నిత్తురేమో చూడవలయును.

### బ్రెయిల్సుఫర్డుగారి సలహా

న్యూలీడరు పత్రికకు వ్రాయుచు, లేబరు పక్ష ప్రముఖులగు బ్రెయిల్సుఫర్డుగారు కాంగ్రెసునుగూర్చి కొన్ని అపోహలను ప్రచురించిరి. కాంగ్రెసు సభ్యులును గాంధిమహాత్ముడును, రెండు రంగములలో పాటుబడుచున్నారట. ఒకరంగమునందు రౌండుటేబిలు సమావేశమునందు పాల్గొనుచు, దేశస్వాతంత్ర్యమును ప్రతిపాదించెదరట. రెండవరంగమునందు, ప్రజాశక్తిని బలపరచుచు, తమ ప్రతిపాదనలు నెగ్గుటకుల ప్రయత్నించుచున్నారట. కాంగ్రెసు సభ్యులు రౌండుటేబిలు సమావేశమును శాసనసభలను గూడ బహిష్కరించిరనియు, పైకొకటి చెప్పి లోపల వేరొకరీతిగ ప్రవర్తించుట లేదనియు, గాంధిమహాత్ముడు సత్యవాది యనియు, బ్రెయిల్సుఫర్డు ప్రభృతులు గ్రహించుట లాభకరము. తాత్కాలిక లాభనష్టములను పాటింపక, కాంగ్రెసు సభ్యులు దేశస్వేచ్ఛ పైననే తమ దృష్టిని నిగుడించి, యావచ్ఛక్తిని తదర్థమై వినియోగించెదరు. ఇట్టి స్థితిలో భారతీయులు ఎత్తుల వైచుచున్నారనియు, కపటనాటకమును ప్రదర్శించుచున్నారనియు జెప్పి బ్రెయిల్సుఫర్డుగారు భ్రమపెట్టుట, నిరర్థకము. వీరింకను మహాత్ముని యుద్యమపు ప్రాశస్త్యమును గ్రహింపలేదని, చెప్పవచ్చును. బ్రెయిల్సుఫర్డుగారు ప్రభుత్వమువారి కొసగిన హితవును వారెంతవరకు పాటించెదరో తెలియదు. ప్రభుత్వమువారు సౌమ్యమార్గము నవలంబింప వీలులేని స్థితి యుదయించుచో, పరిపాలనబాధ్యతను విడనాడవలయునే గాని, కొన్ని పక్షములను చేరదీసి భారతదేశ నిర్బంధమునకు గడంగగూడదని, బ్రెయిల్సుఫర్డుగారు హితవొసగిరి. నిర్బంధములకు గడంగుచో, లేబరుపక్షమునకు తీరనిహాని గలుగునని వీరు మందలించుచున్నారు. కాని, వీరిహితవు పాటింపబడునని తోచదు. రాజప్రతినిధిగారును, సర్ మాల్కాం హెయిలీగారును, నిర్బంధప్రయోగమును సూచించిరి. రాజప్రతినిధి ప్రకటనమును ఆమోదింపని బ్రిటీషుపత్రికలు, వీరిటీవల నిచ్చిన ప్రసంగమును కొనియాడుచున్నవి. ఈ ప్రసంగము కాఠిన్యమును చూపుచున్నదని, ఇవి యభినందించెను. ఈవినింగు న్యూసు పత్రిక మాత్రము తీవ్ర నిర్బంధముల నింకను ప్రయోగింపనందుకు గుందుచున్నది. ఇర్విను ప్రభువుకన్నను, ఎక్కువ కఠినపరిపాలకుని రాజప్రతినిధిగ నియమించుట ఈ సమయమునం దవసరమని తెలుపుచున్నది. ఇట్టి నిర్బంధ ధ్వనులమధ్య, ఇర్విను ప్రభువుగారి ప్రసంగము వేఱువిధముగ నుండియుండుటగాని, నిర్బంధప్రయోగమును సూచించియుండుటగాని వింతగాదు. నిర్బంధవిధానమువలన, ప్రజాశయములు అణగిపోవుటకు మారుగ, మరింత యధికముగ వ్యాపించుట మాత్రము నిశ్చయము.

---

### అమెరికా సెనేటుసభ హైందవస్వాతంత్ర్యము

అమెరికా సెనేటుసభలో సెనేటరు బ్లెయిగారు హైందవ స్వాతంత్ర్యమును అమెరికా గుర్తింపవలయునను తీర్మానమును పంపినపుడు, ఇది నవ్వులాటయని రూటరువార్తలు దెలిపెను. కాని లిబర్టీపత్రికకు జేరినవార్త జూచిన, దీనికిని కొంతబల మేర్పడెనని తలంపవచ్చును. విదేశసంబంధసంఘమున కీ తీర్మానము విచారణకై పంపబడెను. ప్రపంచశాంతిని, ఆయుధ విసర్జనమును గాఢముగ కాంక్షించెడి అమెరికను సంఘములు, హిందూదేశస్వేచ్ఛ యత్యవసరమని గుర్తించుచున్నవి. అందుచే, లోకకల్యాణదృష్టితో వీరీ తీర్మానమును బలపరచుచున్నారు. హిందూదేశమును పరాధీనస్థితిలో నుంచి, ప్రపంచశాంతి నాశించుట అసంగతము గదోపక మానదు. మనఃస్పర్ధకారణముల నన్నిటిని తొలగించుట, శాంతికి ముఖ్యావశ్యకము. దూరదృష్టి గల బ్రిటీషు ప్రముఖులు గూడ ఈ సంగతిని గుర్తించుట లాభకరము. హిందూదేశము స్వాతంత్ర్యము బడయుటకు, అహింసాసాధనము నవలంబింప నిశ్చయించినది. ఈకార్యముసఫలమగుచో, హిందూదేశము ద్వారా లోకకల్యాణము సిద్ధింపకమానదు. ప్రపంచశాంతి సురక్షితముగ నెలకొనక మానదు. కీర్తిశేషులగు విల్సనుగారు ప్రతిపాదించిన స్వయంనిర్ణయసూత్రము అమలులోనికి రాగలదు. అందుచే నాగరికప్రపంచ మంతయు మహాత్ముని యుద్యమమును ఆమోదించి, హిందూదేశమునకు తోడ్పడుట లాభకరము. భారతీయులు మాత్రము అన్యసహాయముపై నాధారపడక, స్వశక్తిపైనను, స్వయంసహాయముపైనను ఆధారపడి, గమ్యస్థానము జేరుట యవసరము. అమెరికాగాని, మరియేయితరదేశముగాని సానుభూతి జూపిన మాత్రాన ప్రయోజనముండదు. ఇంగ్లండులో నేపక్షమువారు సానుభూతి జూపినను, విశేషప్రయోజన ముండదు. నేడు సానుభూతి జూపువారు, రేపు నిరాదరణ జూపవచ్చును. లిబరలు పక్షమువారు కొంతకాలము సానుభూతి జూపి, ఇప్పుడు కన్సర్వేటీవులకన్నను ఎక్కుడు ప్రాతికూల్యము నవలంబించుచున్నారు. లేబరుపక్షమువారు కొంతకాలము గాఢమగు సానుభూతిని ప్రకటించి, పరిపాలనాధికారము చేచిక్కినపిమ్మట, పూర్వవాగ్దానములను విడనాడిరి. హిందూదేశమునకు స్వయంనిర్ణయ స్వాతంత్ర్యమును నిరాకరించిరి. అందుచే అన్యులపై నాధారపడక, స్వశక్తిపైననే భారతదేశ మాధారపడుచో, ఏపక్షమువారును హిందూదేశాభీష్టసిద్ధిని నిరోధింపజాలరు.

---

### శ్రీశైలక్షేత్రము

ఆంధ్రదేశమునందలి పవిత్రక్షేత్రములలో శ్రీశైలము చిరకాలమునుండి ప్రసిద్ధి వహించియుండెను. దుర్గమారణ్య మధ్యమున నున్నను, ఈ క్షేత్రము అసంఖ్యాకులగు యాత్రికుల నాకర్షించుచున్నది. కాని, యియ్యది రానురాను శిథిలావస్థలోకి వచ్చుటచే, దీనిని పునరుద్ధరించుట, భక్తులెల్లరవిధి యగుచున్నది. ఇందునిమిత్తమై యొకసంఘమేర్పడి శక్తివంచనలేక పాటుబడుచున్నది. కాని ప్రజలసాహాయ్యము లేనిది, ఈ సంఘము తనధర్మమును నిర్వర్తింపజాలదు. ఈ సంఘమువారు ధనసహాయమును కోరుచు విన్నపమంపుచున్నారు. వీరి విన్నపమును సఫలపరచుట, ఆంధ్ర మహాజనుల అవశ్యకర్తవ్యము. ఈ సంఘమువారి సమావేశము శివరాత్రినాడు శ్రీశైలమునందు గూడును. ఆ సమయమున, సంఘమువారి భావికర్తవ్యము నిర్ణయింపబడును. ఇంతకు పూర్వము కర్నూలు సబ్ కోర్టువారు శ్రీశైలదేవాలయ పరిపాలన విధాన ప్రణాళిక నేర్పాటు చేసియుండిరి. దీనిని నిర్వహించుటకొక పరిపాలకసంఘము నియమింపబడెను. వీరు, గతసంవత్సరము సమావేశమై నిబంధనల నేర్పరచిరి. యాత్రికులు ఇబ్బంది పడకుండ, దేవాలయ నిబంధన లన్నియు ప్రచురింపబడెను. శివరాత్రి సమీపించుచున్నది. పరిపాలక సంఘమువారి సత్ప్రయత్నములకు యాత్రికులు సర్వవిధముల తోడ్పడి, దేవాలయ పునరుద్ధరణమునకును, దేవాలయ సత్పరిపాలనకును చేయూత నొసగి, శ్రీ మల్లికార్జునుని అనుగ్రహమునకు పాత్రులయ్యెదరు గాక. శ్రీశైలమునకు సరియగు మార్గము లేకుండుటచే, మంచి రోడ్డు వేయవలయునని, చాలకాలమునుండియు కోరబడుచున్నది. ఈ విషయమై మదరాసు శాసనసభలో గూడ తరుచుగ ప్రశ్న లడుగబడెను. యాత్రికులీ విషయమై పట్టుదల జూపుచో, అచిరకాలములో ఈకోర్కె సిద్ధింపక మానదు.

---

### పటేలుగారేమి చేసెదరు?

భారతశాసనసభామందిరమునందలి గ్యాలరీలలో పటేలుగారి యనుమతిలేక నే పోలీసువారిని నియమించుటచే, పటేలుగారు ఆభాగమున కెవరిని రాకుండ జేసిరి. అప్పటినుండియు, పరిస్థితులు మార్పు జెందలేదు. ప్రేక్షకస్థానములు ఖాళీగానుండెను. రాజప్రతినిధిగారు ప్రేక్షకరహిత స్థానములయెదుట నుపన్యసింపవలసివచ్చెను. ఈవిషయమై పటేలుగారికిని, రాజప్రతినిధిగారికిని సంప్రతింపు జరిగెనని, వార్తలు దెలిపెను. దీనిఫలమేమగునో యింకను తెలియలేదు. పటేలుగారీవిషయమై అనధికారసభ్యులతో సంప్రతించిరని తెలియుచున్నది. రాజప్రతినిధిగారొక్కరే ఏవిధమగు పరిష్కారము గావింప వీలులేదనియు, ఇండియా ప్రభుత్వమంతయు దీనిని విచారింపవలయుననియు, భావింపబడెనట. ఇండియా ప్రభుత్వమువారు హోంమెంబరగు సర్ జేమ్సు క్రేరారుగారి ఏర్పాటులను సమర్థించుట సహజము. అట్టిఫలితము జరుగుచో, పటేలుగారి యభిమతము నెరవేరజాలదు. ఆత్మగౌరవమును నిలుపుకొనుటకు పటేలుగారు తమపదవికి రాజీనామా నిచ్చుట దప్ప, వేరుమార్గముండదు. అట్టి సమయ మరుదెంచుచో, జాతీయ పక్షసభ్యులు గూడ రాజీనామా నిత్తురా యను ప్రశ్న యుదయించును. ముందేమి జరుగునో చూడవలయును.

---

## ఫస్టుగ్రేడు ప్లీడరుపట్టాలు

1932 జనవరి 1 వ తేదివరకు కొనసాగబడును

లా కాలేజి రిప్రెజెంటేటివు కౌన్సిలు అధ్యక్షులగు శ్రీయుత సి హెచ్ ఎస్ శర్మగారిట్లు వ్రాయుచున్నారు

హైకోర్టునుండి యీక్రింది యుత్తరవు లాకాలేజ ప్రిన్సిపాలుగారికి నేడు చేరినది — ఫస్టుగ్రేడుప్లీడరు పట్టాలను నిలుపుచేయుటకు నిర్ణయింపబడిన తేది 1-1-1932 వరకును అందుకు దరఖాస్తులు చేరవలసిన తేది 5-10-1931 వరకును పెంచుటకు హైకోర్టువా రుత్తరువు గావించియున్నారు

---

మద్రాసు శాసనసభ ఎన్నిక — మద్రాసు శాసనసభకు జరుగు బై ఎలెక్షనులో తూర్పు గోదావరి జిల్లా నియోజకవర్గమునకు నియమితమైన రెండుస్థానములలో నొకదానికి పి గోవిందరావు బి ఎ బి. యల్ గారు, అడ్వకేటు పురపాలక సంఘాధ్యక్షులు అభ్యర్థిగా నిలుచుటకుల తెలుపుచున్నారు

# సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవము

## ఆంధ్రదేశము

### అంగలూరు

నేటియుదయమున 7½ గంటలకు స్వరాజ్య పతాకమును భజనలతోను జాతీయగీతములతో నూరేగించి పాటిమీదనున్న వటవృక్షమునకు కట్టిరి. సాయంకాలము నాలుగుగంటలకు మరల భజనలతో జాతీయ గీతములతో నూరంతయు మహాత్మగాంధిగారి పటము నూరేగించిరి. ఆ వటవృక్షము క్రింద సభజరుపఁబడెను. గాంధిగారిపటము నొకయాసనంబునునుంచిరి. పెక్కుమంది సభకు హాజరయిరి. పోలీసువారు సబ్ ఇన్ స్పెక్టరుగారు సభకు వేంచేసిరి. శ్రీయుత ఆకొండి కోటయ్యగారు అఖిలభారత కాంగ్రెసువారు చేసిన స్వాతంత్ర్య తీర్మానమును చదివి భావమును సభ్యులకుఁదెలియఁజేసిరి. తీర్మానములతో సభముగిసెను.

బాలకవి కోగంటి దుర్గామల్లికార్జునరావు.

* * * *

### తెనాలి

ఈ రోజున సంపూర్ణ స్వరాజ్య దినోత్సవము జయప్రదముగా యీ నగరమందు పట్టణ కాంగ్రెసు వారిచే జరుపబడినది. నగరమందు రెండుదినములనుండియు, గ్రామములో కరపత్రములు పంచిపెట్టఁబడుటయే గాక, ఖద్దరు హాకింగుకూడ జరుపబడెను. ఉదయం 7-30 గంటలకు జాతీయ విద్యాలయములో జాతీయపతాకారోహణము జరుపబడెను. 8 గంటలకు అక్కడినుంచి పెద్ద వూరేగింపు బయలుదేరి, ముఖ్యమైన వీధుల గుండా తిరిగెను. మధ్యను మారీసుపేటనుంచి ప్రత్యేకముగా బయలుదేరిన వూరేగింపుకూడా పై వూరేగింపుతో కలసెను. షుమారు 200 మంది గ్రామస్థులు ఊరేగింపులో పాల్గొనిరి. మధ్యాహ్నము ఖద్దరు హాకింగు జరుపబడెను. మారీసుపేట అయితా నగరప్పాడు, క్రొత్తపేటలలో మూడు ముఠాలు హాకింగుచేసిరి.

షుమారు రెండువందల రూపాయీల ఖరీదుగల ఖద్దరు విక్రయించబడినది. సాయంత్రము 6 గంటలకు సభ జరుపబడినది. శ్రీయుత బ్రహ్మండం నరసింహంగారు అధ్యక్షత వహించిరి. కాంగ్రెసు తీర్మానము అధికసంఖ్యాకులచే నామోదింపబడెను. సభకు షుమారు 300 మంది హాజరైరి.

(స్వకీయవిలేఖరి)

* * *

### రేపల్లె

అఖిలభారత కాంగ్రెసు సంఘకార్యనిర్వాహక సంఘమువారి యాజ్ఞానుసారము రేపల్లె కాంగ్రెసు సంఘము 26-1-30 తేదిన సంపూర్ణ స్వాతంత్ర్యోత్సవము జరిపిరి. ఆదినమున ప్రాతఃకాలము ఎనిమిదిగంటలకు పతాకోత్సవము ప్రారంభమయ్యెను. నగరములో ముఖ్యవీధులగుండ పతాకము నూరేగించిరి. పతాకమువెంట ఖద్దరు విక్రయింపబడెను. ఇసుకపల్లి, నేతపూడి పేటేరు మొదలగు పరిసర గ్రామములకుకూడ ఖద్దరు విక్రయించుచు పతాకమూరేగించిరి. షుమారు మూటపదిరూపాయల ఖద్దరు అమ్మబడెను. ప్రాతఃకాలము తొమ్మిదిగంటలకు బయలుదేరిన యూరేగింపు సాయంత్రము నాలుగుగంటలవరకు జరుగుటకు పతాకోత్సవములో పాల్గొనిన ప్రముఖులదీక్షయే కారణము. సరిగా సాయంత్రము అయిదుగంటలకు రామకృష్ణపతనమందిరమందు బహిరంగసభ సమావేశమయ్యెను. సభకు మం. రా. శ్రీ రావు వెంకట్రాయణంగారు అధ్యక్షత వహించిరి. సభాధ్యక్షులు సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనను కంఠీరవముగా శ్రోతల కర్థమగునట్లు విపులముగా సభలో జదివిరి. ప్రకటన యంగీకారము తెల్పుటకై సభ్యులను చేతులెత్తవలసినదిగా కోరిరి. 28 గురు సభ్యులు చేతులెత్తుచూ తమ యంగీకారము తెల్పిరి. ఇరువదియెనిమిదిగురిచే ప్రకటన యంగీకరింపబడినటుల సభలో తెలుపబడెను. ఊరేగింపుసభయు చాలశాంతముగాను ఉద్రేకము లేకుండ జరిగెను. అధ్యక్షులకు వందనములతో సభ ముగింపబడెను.

వలివేటి నాగేశ్వరరావు

కార్యదర్శి-పట్టణకాంగ్రెసు సంఘము - రేపల్లె

### ఏలూరు

జనవరి 26 — నేడు స్వాతంత్ర్య దినోత్సవము చాల జయప్రదముగ జరిగినది. ఉదయమున నగరసంకీర్తనము జాతీయ పతాకోత్సవము మిగుల మహోత్సాహముగ జరిగినవి. వందలకొలది ప్రజలు శ్రీ గాంధీ పాఠశాలనుండి యూరేగింపుతో 2 గంటలకు బయలువెడలిరి. శ్రీ మోతే గంగరాజు జమీందారుగారు దయతో వారి యేనుగను యుత్సవమునకిచ్చుటచే నదరు దృశ్యము మరింత రమ్యముగనుండెను. సాయంకాలము 5 గంటలకు మాపురమందిరమున గొప్ప బహిరంగసభ జరిగెను. శ్రీయుతులు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, గజవల్లి రామచంద్రరావు ఎం ఎ గారు, మాగంటి బాపినీడుగారు, బండా వియ్యన్నగారు, అల్లూరి జగన్నాథదాసు యం. ఏ, బి, యల్ గారు, వారణాసి రామమూర్తి బి. ఎ. బి. ఎల్ గారు, డి వి అప్పారావు బి ఏ బి యల్ గారు, వల్లూరి రామారావు ప్లీడరుగారు, వల్లూరి సుబ్బారావు బి ఏ బి ఎల్ గారు తమిరిశ రామచంద్ర అప్పారావు బి ఏ బి యల్ గారు, మంజువాణీప్రెస్సు మేనేజరు వందిరాజు చలపతిరావుగారు, అడివికొలను భీమేశ్వరరావు బి ఏ బి యల్ గారు, పైలవరపు తిమ్మయ్యగారు, అల్లూరి జానకిరామయ్యగారు యింకను అనేకమంది పురప్రముఖులు సభ నలంకరించిరి. ఈమధ్య యిట్టి జనవిస్తీర్ణముతో కూడిన సభ జరిగియుండలేదని చెప్పవచ్చును. రమారమి 1500 కు పైగా జనము చేరియుండిరి.

బండా వియ్యన్నగారి యుపపాదనపై శ్రీ గజవల్లి రామచంద్రరావు యం ఏ గారు అగ్రాసనాధిపత్యమును వహించిరి. జాతీయ గీతములు భారతమాత స్తవములు పాడబడిన పిదప అధ్యక్షులు సభయొక్క యుద్దేశ్యమునుగూర్చి తెలిపి, అఖిలభారత కాంగ్రెసుసంఘము వారు పంపిన తీర్మానము నామోదించుటతప్ప యుపన్యాసములు మున్నగునవి జరుగకూడదని వివరపరచి శ్రీయుత గోవిందాచార్యులుగారిని దానిని చదువుమని కోరిరి. గోవిందాచార్యులుగారు దానిని చదివినపిదప సభవారి యామోదమును తెలుపుడని కోరగా, అందరు దాని నేకగ్రీవముగ నామోదించిరి. వ్యతిరేకు లెవ్వరైన నుండిన తెలుపుడనగా యెవ్వరు లేకపోయిరి. ఇట్లు సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము జయప్రదముగ నామోదింపబడినది. శ్రీ గాంధీమహాత్మునకును భారతమాతకును జేజేలతో సభ ముగిసినది. కడపట మంగళము పాడబడినపిదప సభ్యు లత్యుత్సాహముతో వెడలిపోయిరి.

(స్వకీయవిలేఖరి)

* * *

### గురువారెడ్డిపాలెం-గుంటూరుజిల్లా

ఇక్కడ యీనెల 26 వ తేది సాయంత్రం 5 గంటలకు శ్రీయుత వాకా సుబ్బారెడ్డిగారి అధ్యక్షత క్రింద జరిగిన బహిరంగసభలో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారిచే ప్రకటింపబడిన సంపూర్ణస్వరాజ్య తీర్మానము చదువబడి, చేతులెత్తుటద్వారా యేకగ్రీవముగ నామోదింపబడెను.

(ఒక విలేఖరి)

* * * * *

### తుని

తునిలో విన్న వీయుత్సవమతి వైభవముగా ఉగయ సాయంకాలములయందు జరుపబడినది. 25 వ తేదీని శ్రీయుత కోటమర్తి రఘుపతిరావుగారు సంపూర్ణ స్వాతంత్ర్యోత్సవమును గూర్చి చక్కగా ఉపన్యసించిరి. 26 తేదీ ఉదయం శ్రీ విద్యానంద లైబ్రరీనుండి ఉత్సవము బయలుదేరినది. 20 స్వరాజ్యపతాకములను ధరించి హైస్కూలు విద్యార్థులును, ఖద్దరు వస్త్రములును గాంధీ, తిలక్, దాసుపటములతో కాంగ్రెసు సభ్యులును, మద్దెల భజనలతో స్వరాజ్యకీర్తనలతో గాయకులును తాండు మేళములతోనున్న సుమారు 800 మందివరకు ముఖ్యవీధులలో తిరిగి సరిగా 8½ గంటలకు తుని టౌనుహాలులో స్వతంత్ర పతాక ప్రతిష్ఠను చేసిరి. మధ్యాహ్నం 3 గంటలకు అదే విధముగా పట్టణమంతయును తిరిగి 5 గంటలకు టౌనుహాలునకు చేరిన పిమ్మట సీతానగరం సత్యాగ్రహాశ్రమకామకులగు మహాత్మ నిపటులు 20 ఖద్దరు ధారలకు పంచిన పిమ్మట 5 గంటలకు సరిగా కాంగ్రెసు కార్యదర్శి సంపూర్ణ స్వతంత్ర తీర్మానమును చదివిన పిమ్మట సభలో యేకగ్రీవముగా సుమారు 850 జనులు ఆమోదించిరి. కొందరు విద్యార్థులు తోపిమెట్టునను ఎత్తయిన కొండమీద పెద్ద జాతీయపతాకమును నెలకొల్పిరి.

(ఒకవిలేఖరి)

### మచిలీపట్నం

సంపూర్ణ స్వరాజ్యమహోత్సవదినము జయప్రదముగా జరుపబడెను. సుమారు 30 ప్రదేశములందు ఊరేగింపు వగైరా యుత్సాహ ప్రదర్శనములు జరిగెను. 25 వ తేదీన పెద్దబహిరంగ సభ జరిగెను. వేలకొలది విద్యార్థులు హాయలు సభకు వచ్చేసిరి. సభలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఉపన్యసించి యిట్లు చెప్పిరి.

పై ప్రాయిగారి యుపన్యాసమున కొక్కటే అర్థము కలదు. పై ప్రాయిగారి యుపన్యాసమును సరిగా అన్వయము చేసికొన్నయెడల, సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానమును కాంగ్రెసు సభవారు ప్రకటించుట ఎంత యవసరమై యున్నదో బోధపడగలదు. ఈ యుపన్యాసమువల్ల మరునాటి సభకు జనులు అసంఖ్యాకులై వచ్చేసిరి. ఉదయము జాతీయ పతాక ప్రతిష్ఠాపన జరిగెను. అటుపిమ్మట పెద్ద యూరేగింపు జరిగెను. జాతీయ జయవాదములతోడను జాతీయసంగీతములతోడను రాజవీధులగుండా ఊరేగింపు జరిగెను. డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు జాతీయపతాకము ప్రతిష్ఠించిరి.

సాయంకాలము సరిగా 5 గంటలకు షుమారు మూడువేలమంది సమావేశమైరి. కాంగ్రెసు తీర్మానమును అందరును లేచి నిలుచుండి ఆమోదించిరి.

విప్లవము వర్ధిల్లు గాకయనియు, సామ్రాజ్యవాదనాశనము నశించుగాకయనియు పెద్దపెద్ద అక్షరములతో అచ్చొత్తించిన ప్రకటన పత్రములు గోడలకు అంటించబడెను. ఈ ప్రకటనపత్రికలవల్ల ప్రజలలో కొంత సంచలనము కలిగెను. గతరాత్రి గోడలకంటించబడిన ప్రకటనపత్రములను పోలీసువారు జాగ్రత్తగా గోడచెరికి తీసికొనిపోయిరి.

(తంతివార్త)

సాయంకాలము జరిగిన సభలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు తీర్మానమును చదివిరి. ఉదయము అఖిలభారత చరఖాసంఘము యొక్క ఆంధ్రదేశ శాఖా కార్యాలయావరణమందు జాతీయపతాక ప్రతిష్ఠింపబడెను.

(శ్రీ ప్రె)

మచిలీపట్నం జనవరి 26 — నేటి యుదయం 8 గంటలకు అఖిలభారత చరఖాసంఘ బ్రాంచి ఆఫీసువద్ద జాతీయ పతాక వందనోత్సవానంతరం మేళతాళములతోను, స్వరాజ్యపతాకములతోను పట్నములో గొప్పయూరేగింపు జరిగెను. సాయంత్రం 5 గంటలకు డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి యధ్యక్షత క్రింద చరఖాసంఘ ఆఫీసువద్దనే గొప్ప బహిరంగసభ జరిగెను. అందు అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారిచే ఆమోదింపబడిన "సంపూర్ణ స్వాతంత్ర్య" తీర్మాన మందరిచే అంగీకరింపబడెను.

* * * *

### విజయనగరం

యం. వెంకన్నగారిట్లు తంతివార్తనంపిరి — విజయనగరములో సంపూర్ణ స్వరాజ్యమహోత్సవము జరుపబడినది. దినమంతయు చక్కగా ఎండ కాయుచుండెను. పీపిల్సుపార్కువద్ద ఉదయము దేశభక్తి ప్రపూరితులైన ప్రజలు రెండువేలమంది సమావేశమైరి. జాతీయపతాక ప్రతిష్ఠాపన జరుపబడెను. జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులగు టి. విశ్వనాథంగారు యీ సంపూర్ణస్వరాజ్య మహోత్సవమునకై ప్రత్యేకముగా విశాఖపట్నమునుండి విజయనగరమునకు వచ్చేసిరి. జాతీయపతాకము ప్రతిష్ఠించుటకు పూర్వము సభాప్రయోజనమును విశ్వనాథంగారు వివరించిరి. సాయంకాలము 5 వేల మంది ప్రజలు సమావేశమైరి. అప్పుడు విశ్వనాథంగారు కాంగ్రెసు తీర్మానమును చదివిరి.

ఏకగ్రీవముగా సభలో ఆమోదింపబడెను. ఇచట పోలీసువారు ప్రసన్నవేషధారులై యీ యుత్సవ ప్రదర్శనము కన్నింటికిని హాజరైరి. నిర్విఘ్నముగా మహోత్సవము పూర్తిగా జరిగెను.

(తంతివార్త)

---

### మచిలీపట్నము

ఈనెల 18 వ తేదీ శనివారం ప్లీడరు గుమాస్తాల సంఘముయొక్క ద్వితీయ వార్షికోత్సవము జరుపబడెను. ఉపాధ్యక్షుల లెక్చరున్ను ప్రెసిడెంటుగారి యుపన్యాసమున్ను. అనంతరం అల్పాహారములతో సభముగిసెను. ఈ దిగువ పేర్కొనబడినవారు సదరు సంఘముయొక్క పరిపాలకులుగా ఎన్నికలలో తిరిగి యెన్నుకొనబడిరి

1. ప్రెసిడెంటు — వేమూరి సుబ్రహ్మణ్యంగారు.
2. సెక్రటరీ — గోపరాజు వెంకటసుబ్బారావుగారు
3. ట్రెజరర్ — పమిడిముక్కల నరసింహారావుగారు
4. కమిటీమెంబరు —
   1. ఓగిరాల వెంకటరత్నంగారు
   2. జమ్మలమడక లక్ష్మీనరసింహంగారు
   3. కొవ్వర్ల కోదండరామయ్యగారు

(ఒకవిలేఖరి.)

# సంపూర్ణస్వరాజ్యమహోత్సవము

## సేతుశీతనగపర్యంతము భారతజాతీయమహాసంకల్పము బహిరంగముగా ప్రకటింపబడుట

శృంగేరిలో ఉత్సవము అధికారులచే నిషేధింపబడుట

### కాశీక్షేత్రమున ఉత్సవము

కాశీ, జనవరి 27 — పురమందిరమున పట్టణ కాంగ్రెస్ సంఘాధ్యక్షుడగు సంపూర్ణానంద గారు ఉదయము జాతీయ పతాకను ప్రతిష్ఠించుటతో సంపూర్ణ స్వాతంత్ర్యమహోత్సవములు ప్రారంభించబడెను. యువజనసమితి సభ్యులు, యితర బాలురు చాలమంది సభకు వచ్చిరి. అఖిలభారత కాంగ్రెస్ సంఘ కార్యదర్శియగు శ్రీ ప్రకాశ్ గారు కార్యక్రమమునందు పాల్గొనిరి. నగర సౌధముల మీదను, దుకాణముల మీదను, జాతీయ ప్రతిష్ఠానముల మీదను జాతీయపతాకలు ప్రతిష్ఠింపబడెను. సాయంత్రము యువకులచే ఏర్పాటు గావింపబడిన ఊరేగింపు ప్రధాన రాజమార్గముల గుండ నగరసంకీర్తనము గావించెను. సాయంత్రము పురమందిరమున పదివేల ప్రజలు సమావేశమై సభ గావించి వర్కింగ్ కమిటీ తీర్మానమును ఆమోదించిరి. విశ్వనగరములో సభ ముగిసెను. రాత్రి నగరమునందలి యనేక సౌధములు చిత్రవిచిత్రములుగా నలంకరింపబడెను. పరిసర గ్రామములలో ననేకచోట్ల సభలు జరిగెను. ఒక గ్రామములో శ్రీ ప్రకాశ్ గారు తీర్మానము నామోదించిరి. ఈ ఉదయము హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ వారి కరపత్రములు అనేకచోట్ల అంటించబడెను. ఈ సందర్భమున కాశీ యువజనసమితి సహాయ కార్యదర్శియగు కేదార్ ప్రసాద్ గారు అరెస్టు చేయబడిరి. కాశీ విశ్వవిద్యాలయమందలి విద్యార్థిబృందము కూడ స్వాతంత్ర్యమహోత్సవమును జరిపిరి. (అ. ప్రెస్)

### లాహోరులో ఉత్సవము

#### జాతీయపతాకోత్సవము

లాహోరు, జనవరి 26 — పదిగంటలయ్యేను జాతీయ పతాకోత్సవము జరుగునని దస్తు వాయించుటవలన ప్రజలు తెల్లవారి తరుణము నివాసస్థలములనుండి పతాక ప్రతిష్ఠాపన స్థానములకుపోయిరి. పురపాలక సంఘమువారి ప్రధాన భవనములలో దాదాపు పదివేలమంది సమావేశమైరి. విచిత్రవస్త్రములను దాల్చి స్త్రీపురుషులు కాంతిమంతులై నిలుచుండిరి. 31 టపాకాయలు మ్రోగించిన మీదట జాతీయపతాక ప్రతిష్ఠాపనోత్సవము ప్రారంభమయ్యెను. ఎరుపురంగుగల భాగముపై నుంచబడుట యిప్పటివిశేషము. డాక్టరు గోపీచందు, సత్యపాల్, సర్దార్ సార్దూల్ సింగ్, లాలా దునీచందు గారలు పతాకయొక్క మాహాత్మ్యమును గూర్చి యుపన్యసించిరి. ప్రజలు తిరిగి పోయినదాక పోలీసుదళము కొంతదూరముననుండె. జండాపాటలు పాడబడెను. ఇప్పటి మాత్రమే గాక కాంగ్రెసు కార్యాలయములలోను భారత ప్రజాసేవా సంఘమునందును, ప్రభుత్వకళాశాల, లా కాలేజి, విశ్వవిద్యాలయ వసతిగృహములయందును జాతీయపతాక ప్రతిష్ఠింపబడెను. విశ్వవిద్యాలయ వసతిగృహమునందు కుమారి లజ్జావతి పతాకోత్సవము సలిపెను. హిందూ శ్రేణులలో దుకాణములును, గృహములును బాగుగా పతాకాదులతో నలంకరింపబడెను. విప్లవపారస్వతము విరివిగా పంచిపెట్టబడెను. మధ్యాహ్నము ఊరేగింపు జరిగెను. ఊరేగింపు ఉదయము జాతీయ పతాక ప్రతిష్ఠింపబడిన స్థలమునకు పోయెను. అప్పట చాలమంది చేరియుండిరి. అందరును కలసి 60 వేల ప్రజ యుండిరి. ఈ సభలో కాంగ్రెస్ వర్కింగుకమిటీ వారి తీర్మానము ఆమోదింపబడెను. చేతులెత్తి ప్రజలు తీర్మానమునకు తమ సమ్మతిని తెలిపిరి. విప్లవము చిరస్థాయిగా వర్ధిల్లుగాక యను కేకలతో ప్రజలు వెడలిపోయిరి. ప్రత్యేకముగా పోలీసు ఏర్పాటు లేమియు జరగలేదు. నగరములో చాలగృహములు బాగుగా నలంకరింపబడినవి. (అ. ప్రెస్)

### కలకత్తాలో హిందువులకును మహమ్మదీయులకును తగాదా

కలకత్తా, జనవరి 27 — నిన్న కలకత్తాలో జరిగిన స్వరాజ్యోత్సవములో హిందువులకును మహమ్మదీయులకును కొట్లాట జరిగెను. సాయంత్రము 5 గంటలకు కాంగ్రెస్ వాదులు వకీల్ మసీదుప్రక్కగా వందేమాతరం అని యరచుచు పోవుచుండగా అట్టి కేకలు వేయరాదని మహమ్మదీయులు అటంకపరచిరి. ఘర్షణ కొట్లాటలోనికి దిగెను. ఇరుప్రక్కలవారికి దెబ్బలు తగిలెను. హిందువులు బలవంతముగా మసీదుగోడ కొరకు పోవుదలచిరి. పోలీసు సూపరింటెండెంటు, జిల్లా మేజిస్ట్రేటు కాంగ్రెస్ నాయకులతో చెప్పిరి. ఈతగాదా జరిగినప్పుడే యితర స్థలములలో కూడ కొట్లాటలు జరిగెను. కొంతమంది హిందువుల యిండ్లు లూటీ చేయబడెను. కాని పోలీసు సిబ్బంది వచ్చినతోడనే అంతయు ఆగిపోయెను. రాత్రి నగరమునందంతట శాంతముగా నుండెను. దుండగములు జరిగినచోట పోలీసులు కాపలా కాయుచుండిరి. వీధులలో ఆయుధపాణులగు రక్షకభటులు పారా యిచ్చుచుండిరి.

### ఢక్కా పూరీపట్టణములలో ఆజ్ఞోల్లంఘనము

బెంగాల్ బీహారురాష్ట్రములందు అనేకస్థలముల యందు స్వాతంత్ర్య మహోత్సవములు శాంతముగా జరిగెను కాని పూరీ, ఢాకా పట్టణములయందు పోలీసు ఆజ్ఞలకు వ్యతిరేకముగా సభలు జరిగినట్లును, ఊరేగింపులు జరిగినట్లును న్నది. జెండాను చూపించుమని పోలీసు అడుగగా ఢక్కాలో పోలీసువాని తలపాగా ఎగిరిపోయెను. పూరీలో ఆజ్ఞోల్లంఘనమునకుగాను 6 మందిపై (అందులో ఒకరు న్యాయవాది) దావా వేయబడెను. జిల్లాకాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడగు లింగరాజ్ మిశ్రాగారి మీదను, యితరుల మీదను సర్కారు దావా తేబడుచున్నది. (అ. ప్రె.)

### పాట్నాలో నిషేధపుటుత్తరువులు

పాట్నా, జనవరి 25 — పోలీసు ఆక్టు 30 సెక్షను ప్రకారము బాబు రాజేంద్రప్రసాద్, డాక్టరు మహమూదు గారలపై నోటీసు జారీ చేయింపబడెను. జెండాను ఎత్తుకొని ఊరేగింపు లేకుండ నుండుట మంచిదని వారు ప్రజలకు సలహా నిచ్చిరి. ఏమి జరిగినను సభలు జరిపి జాతీయ పతాకలను ప్రతిష్ఠించెదమని వారు అధికారులకు తెలియబరచినారు. పట్టణములో అనేక వదంతులు ప్రబలియున్నవి. (ఫ్రీ ప్రెస్)

### లక్ష్మణపురము

లక్ష్మణపురములో స్వాతంత్ర్యోత్సవము అతివైభవముగ జరిగెను. విశ్వవిద్యాలయమునకు సంబంధించిన వసతి గృహములలో పతాకలు ప్రతిష్ఠింపబడెను. మహమ్మదాబాదు వసతి గృహములో పతాకోత్సవము అత్యంత వైభవముగా జరిగెను. తరువాత సభలో కాంగ్రెస్ తీర్మానము ఆమోదింపబడెను.

### వార్ధాగంజ్

వార్ధాగంజ్, జనవరి 27 — జనవరి 26, ఉదయము 8 గంటలకు వార్ధాగంజ్ పౌరులు స్వాతంత్ర్య మహోత్సవమును అత్యుత్సాహముగా జరిపిరి. ఘోషగారిని, వారి స్నేహితులను అభినందించుటకు సాయంత్రము సభ జరిగెను. విద్యార్థులలో ప్రచండసంచలనము కలిగినది. తమతమ వసతిగృహములలో ప్రత్యేకముగా జాతీయపతాకను ప్రతిష్ఠించి తరువాత కాంగ్రెసు కార్యక్రమములో సంపూర్ణముగా పాల్గొనిరి. జమనాలాల్ బజాజ్ గారి యధ్యక్షతను జరిగిన మహాసభలో స్వాతంత్ర్యతీర్మానము ఆమోదింపబడెను. (ఫ్రీ ప్రెస్)

### వివిధస్థలములలో ఉత్సవములు

#### జయప్రదముగా జరుగుట

హైదరాబాదు (సింధు), హుబ్లీ, ధార్వార్, ఉడిపి, లక్ష్మణపురము, కరాచి, రంగూన్, అక్యాబ్, (బర్మా), పెషావర్, చిదంబరం, కాలికట్, కారైకూడి, జబ్బల్పురము, ధల్లోలి (నాగపురం), మధుర (తమిళనాడు), బండబిల్లా (బెంగాల్) గ్రామములలో స్వాతంత్ర్యోత్సవములు అత్యంతవైభవముతో జరిగెననియు, జాతీయపతాకలు ప్రతిష్ఠింపబడెననియు మాకు వార్తలు తెలియవచ్చినవి. అక్యాబ్‌లో ఇద్దరు యువకులు అరెస్టు చేయబడెను. పెషావరులో సిక్కు ఉత్సాహము మహమ్మదీయ నవీను ప్రక్కనుండి జాతీయ పతాకముతో ఊరేగెను. చిదంబరములో అన్నామలై విశ్వవిద్యాలయములో చదువుకొను విద్యార్థులు, ఊరేగింపుతో వెళ్లి సభలో పాల్గొనిరి. లాలాజీ చౌకులో స్వాతంత్ర్య తీర్మానము ఆమోదింపబడెను.

### శృంగేరిలో పోలీసు ఉత్తరువులు

స్వాతంత్ర్యోత్సవము సలుపరాదని శృంగేరిలో నాయకులగు కృష్ణారావు ప్రభృతులపై నోటీసులు జారీచేయబడెను. వర్కింగ్ కమిటీ ఆజ్ఞలను పొందువరకు ఆజ్ఞోల్లంఘనము చేయదలచలేదని కృష్ణారావుగారు చెప్పిరి. ప్రజలు ఉద్రేకము నొందరాదనియు, తమ గృహములలో ఉత్సవము జరుపుకొనవలసినదనియు కృష్ణారావుగారు ప్రజలను కోరిరి.

### ఢక్కాలో అల్లరులు

#### విద్యార్థులకును మహమ్మదీయులకును కొట్లాట

ఢక్కా, జనవరి 27 — ఢక్కాలో విద్యార్థులు ఊరేగించుచుండగా కొందరు మహమ్మదీయులకును కొట్లాట జరిగెను. కొంతమందికి దెబ్బలు తగిలినవి. మసీదును భ్రష్టము చేయుటకు విద్యార్థులు ప్రయత్నించిరని మహమ్మదీయులనుచున్నారు. పోలీసులు అప్పుడే వచ్చి హిందూయువకులనందరను అరెస్టు చేసిరి. ఆ ప్రదేశము పోలీసులచే రక్షింపబడుచున్నది. ఈరోజు కూడ అక్కడక్కడ కొట్లాటలు జరిగినట్లు తెలియుచున్నది. కొట్లాటలు జరిగిన ప్రదేశములలో ప్రజలు ఉద్రేకపూరితులై యున్నారు. ఈరోజు సిగరెట్టులు కొంచెము కాల్చబడినవి. పోలీసులు వచ్చిరి గాపున మహమ్మదీయులు హిందువులపైబడి దొమ్మి చేయలేదు. మేజిస్ట్రేటు 144 సెక్షను జారీచేయించెను. కల్లు దుకాణములు మూసివేయబడినవి. మేజిస్ట్రేటు రాజీసమావేశము నాహ్వానించినారు. (ఫ్రీ ప్రెస్)

* *

### కారాగృహములో స్వాతంత్ర్య దినోత్సవము

#### సుభాసుచంద్రబోసుగారును, మిత్రులును జరుపుట

కలకత్తా, జనవరి 28 — శ్రీయుత సుభాస్ చంద్రబోసుగారును, వారితోబాటు రాజద్రోహనేరమునకై శిక్షింపబడిన తదితరులును అలీపూరు సెంట్రలు జెయిలులో 'పూర్ణస్వరాజ్య'దినోత్సవమును జరిపిరని 'లిబర్టీ' పత్రిక ప్రకటించుచున్నది.

#### జగన్నాథ ప్రసాద్ సింగుగారి నిరశనవ్రతము

మ్యాజఫర్ పూర్ కాంగ్రెసు సంఘాధ్యక్షులగు జగన్నాథ్ ప్రసాద్ సింగుగారు శ్రీమతులు ప్రాసిక్యూషను 108 సెక్షను క్రింద శిక్షింపబడియుండిరి. ప్రత్యేక తరగతి నిర్బంధితుల వలె తమ్ము పరిగణించుట కధికారులు నిరాకరించినందువలన, వారు నిరశన వ్రతమును బూనియున్నారని సై పత్రికయే ప్రకటించుచున్నది. (అ. ప్రె.)

